డు॥ ౫॥ దానిశామంతినవేంకట । పరగురునికరుణారసంబున ఆశపాశములన్నిరోసి। కేశవునినుతిజేసిపొగడుము॥ యెందు॥ ౬॥ క్రూరబుద్ధినిభక్తవరులను । వేరుశాయకు యెంతమాత్రము । ధరణిలో శ్రీయడ్లరామ । దాసుమాటకు । మీఱవడచెడు॥ యెందు॥

గీ॥ శృతిస్మృతేతిహాస । సూత్రంబుదెలసియు । మతభేదములయందు । మర్మమెరిగి । సమ్మతులకుమనస్వాత్మనీవేకదా । ధరనుయడ్లరామ దాసపోష॥

—* మాయామాళవిగౌళ రాగము- ఆదితాళము *—

గౌర॥తత్వం॥ చెదరిపోకనిలుమ।మనస । హృదయకమలమునను। ముదమునసద్గురు। పదములువదలక । కుదురుగనిమునివు । గదుముచుపదపడి। చెద॥ ౧॥ చర్మనాటకమును । గనిగురుధర్మముపదవకుము। మర్మమెరిగి సత్కర్మవర్తనమును । నిర్మలమున । నీనిజమువదెలియుచు॥ చెద॥ ౨॥ మూడువేదుకలను । గూడెడివాడౌ చెడుమద్భుతము । నేడునీకుమేలోదులేదు । యిదిచూడుమునినునివు । గూడినవేడుక॥ చెద॥ ౪॥ జాతిభేదములనూజేయుచు । న్యాతినిబడబోకు । పాతకములు విపరీతముచేయకు । ఖ్యాతిగతత్వవేత్తవునీవై॥ చెద॥ ౫॥ బంధముక్తియనేడి । భ్రమలనుపొందవలదువినుమి । ముందునీవుయెందుండివస్తివో । అంతునసీవానందమైయుందుమి॥ చెద॥ ౬॥ పరిపరివిధములను । నీనిజగురుతుదెలియవలెను। ధరలో శ్రీమంతిన వేంకటగురు । వర్యులునీవును । ఒకటేయనుకొని॥ చెద॥ ౭॥ అఖిలరూపములను । నీవెఆయినతెజమనియు । ప్రకటముగ శ్రీయడ్లరామ । దాసుడురచియించెను । లోకవిచారణ॥ చెదరి॥

గీ॥ యేకాక్షరినిగూర్చి । ఏద్కతో జపియించు । లోకమునయట్టి । వివేకులెల్ల। రాకపోకలులేని । రహస్యంబుగాంతురు । ధరను యడ్లరామ దాసపోష॥

—* మాయామాళవిగౌళ రాగము- అటతాళము *—

రాగ॥ తత్వము॥ ఓంఓంఓంఓంఓంయనుమా । ఓంకారప్రణవనాదమువినుము। అహంబ్రహ్మాస్మిఅనెడిశృతిని । నీఆత్మనుఐక్యము । జేసుకొనుటకై॥ ఓంఓం॥ ౧॥ పుట్టుటగిట్టుటలేదనుమీ । పరిపూర్ణాకారాగమిది విడువకుమీ । గుట్టుదెలసియీవట్టిభ్రాంతిలో । పట్టుబడక । యీబట్టబయలుగని॥ ఓంఓం॥ ౨॥ యెక్కువతక్కువయనుప్రకృతిలో । చిక్కుబడక ముఖ్యముగనుము । నిక్కముగ మట్కమలంబులపై । యెక్కిబ్రహ్మమును । చక్కగగాంచియు॥ ఓంఓం॥ ౩॥ తనువుజూచుకొని భ్రమయకుమా । తనలోగురుతెరుగుట ఘనముసుమీ । వినయముతో కనుపాపలలోపల । అణు

స్వరూపమును । బెనగిభునయుగను॥ ఓంఓం॥ ౪॥ సతులుసుతులు బాంధవులుమనకు । పరగతులుజూపగలేరుసుమీ । మతినివద్గురుని । హితవుగనమ్మితె । వెతలుదీర్చి రక్షించుసుమీ॥ ఓంఓం॥ ౫॥ ఈషణములుయను పాశబంధములు । గోసివిషయములు । ద్రోయుసుమా । భాసురముగ శ్రీమంతినవేంకట । దేశికులనుగని । ఆశ్రితుండవై॥ ఓంఓం॥ ౬॥ నశ్యమునీవైనావుసుమీ । యీమర్మమెరుగుటె । ముక్తిసుమీ । నిర్మలమున శ్రీయడ్లరామదాసుడు । బోధించిన । ధర్మమువిడువక॥ ఓంఓంఓంఓంఓం॥

గీ॥ అక్షరంబులురెండు । కుక్షిలోబఠియించి । దృశ్యములలోపల । దృక్కుగాంచి । తత్స్వరూపమనుచు । దలతురమనస్కులు । ధరనుయడ్లరామ దాసపోష॥

—* అసావేరి రాగము- ఆదితాళము *—

౧౬॥ తత్వము॥ సోహం సోహం సోహం యనుచును । సుఖమునొందవలెరా। దేహము గేహము మీదనుమోహము । ద్రుంచివేయవలెరా॥ సోహం॥ ౧॥ త్రిగుణములనియెడి । పగవాళ్ళనుగని । తెగవేయగవలెరా । వగవక అరిషడ్వర్గబాంధవుల । తగలబెట్టవలెరా॥ సోహం॥ ౨॥ కోరికలనియెడి । నరకకూపమున । జారకయుండవలెరా । తర్కములాడెడి । తామసగుణమును । కొరికివేయవలెరా॥ సోహం॥ ౩॥ స్థిరతరముగ। నీలోపలహారతిల। కొరతనేయవలెర । కర్తలైన షట్చక్రవర్తులతో । కలసియుండవలెరా॥ సోహం॥ ౪॥ ఈషణత్రయమును । విడచియుగురుని । ఉపాసనజేయుమురా । వాసిగానుసహస్రారమందు । జగదీశునిగనవలెరా॥ సోహం॥ ౫॥ సెలుగమంతిన । వేంకటార్యగురు । కీలుదెలియవలెరా । పాలభాగమున । వాలలాడుగురు। లీలజూడవలెర్రా॥ సోహం॥ ౬॥ మతిమంతుడవై । ద్వితీయాక్షరమును । స్తుతియింపగవలెరా । అతులితముగ శ్రీయడ్ల । రామదాసుడు । యనుభవమిదిరా॥ సోహంసోహం॥

గీ॥ చతురాక్షరిమంత్ర । ధ్యానంబుసేయుచు । హితశత్రులార్గురిని । హతముజేసి వ్రతమునల్పువాడు । అతడెపోబ్రహ్మంబు । ధరనుయడ్లరామ దాసపోష॥

—* నాదనామక్రియ రాగము- ఆదితాళము *—

౧౭॥ తత్వము॥ నారాయణ । నారాయణ । యనుచును । నమ్మిస్మరించుడీనరులార । అరమరలేకను పరమాత్ముడు మిము । దరిజేర్చునుసజ్జనులార॥ నారా॥ ౧॥ నానాక్రోధలోభమోహములు । కాల్చివేయుడీనరులార । నియమముతోగురుధ్యానము । ద

లచియు । పామరమణచుడీ నరులార॥ నారా॥ ౨॥ పాపపుణ్యయుగమునెడి । భ్రాంతిలో । బడిచెడిపోకుడీ నరులార । చూపుసిలపి । యాపాపలలోపల । దీపముగనుడీజనులార॥ నారా॥ ౩॥ మోసగాండ్ల । నెడబాసిదేశకుని । యోచనచేయుడీ నరులార । చేసినఘోరపాపకర్మమెడ । బాసిపోనుసజ్జనులార॥ నారా॥ ౪॥ నామరూపక్రియలేనిదానిపై । లక్ష్యముంచుడీనరులార । క్షేమమీరపెనుశైలుజేరుటకు । ప్రయత్నించుడీ సజ్జనులార॥ నారా॥ ౫॥ భాసురముగ। మంతినవేంకటగురు। రహస్యముసతతము। నరులార । ఆశతోమదినుతియించిన మోక్షము । గాంచిసుఖింతురు । నరులార॥ నారా॥ ౬॥ ముఖపద్మముపై । సఖియనుగూడి । సుఖమునుబొందియు । నరులార । ప్రకటితముగశ్రీయల్ల । రామదాసుడు రచియించెను జనులార॥ నారాయణ।

గీ॥ పంచాక్షరిమంత్రమును । స్మరించియు । యూపప్రపంచభవపాశములు ద్రుంపైచి యెంచిపరమిదియని వహించుటాదెయోగి । ధరనుయల్లరామ దాసపోష।

—* నాదనామక్రియ రాగం. అట తాళం *—

పల్ల॥ తత్త్వము॥ నమశ్శివాయ । యనుచునబ్రహ్మ । నందమునొందుచునుండవలెన్ । అవశ్యముగ సద్గురు । చరణములకు । నమోస్తులేయని । నుడువవలెన్॥ నమ॥ ౧॥ పొంకమలరగురు । పాదపంకజము । శంకలేక సేవించవలెన్ । సాంఖ్యతారకమనస్కయోగములు । సద్గురుకృపచే నెరుగవలెన్॥ నమ॥ ౨॥ పంచేంద్రియములు । వంచిప్రకృతిని । జయించిబ్రహ్మమును గాంచవలెన్ । అంచితముగషోడశభావముచే । అచలముతానైయుండవలెన్॥ నమ॥ ౩॥ లోపలవెలుపల । చూపులరూపుల । వ్యాపకమైతానుండవలెన్ । మాపురేపుయను । మాయనుచిక్కని । దీపముతానైదీరవలెన్॥ నమ॥ ౪॥ అండపిండబ్రహ్మాండస్థానము । కుండలాగ్రమునమండవలెన్ దండిగామభూమండలమంతయు । నిండిఅఖండమైయుండవలెన్॥ నమ॥ ౫॥ ఇలలోశ్రీమంతినవేంకట । గురుపుంగవ । నీఫలముందవలెన్ । పలుమారులుయోనులలోబుట్టని । స్థలమునందు । తానిలువవలెన్॥ నమ॥ ౬॥ కోటివిద్యలుమాటికి । యిదిబూటకమని । నోటనుచాటవలెన్ । సాటిలేనశ్రీయల్లరామ । దాసునిమాటలు । చెవినాటవలెన్॥ నమశ్శివా॥

గీ॥ కతలాడుచువరటించు । కలియుగములోనాడ । నిరుకుదెలియలేదు । స్థిరతర

ముగ । దరచిమూడఝాడ । దాసిపోకతఁయగు । ధరమయజ్ఞరామ దాసపోష॥

—* నాదనామక్రియ రాగము- అటతాళము *—

౯౯॥ తత్వము॥ దీని భావము దెలియవలెనయ్యా । నరులారమీరు । దేహవాస నవిడువగదరయ్యా॥ దీనిభావము దెలియలేకను । దేహవాసనవిడువజాలక । గాఢ మోహము దాల్చిపుడమిని । మూఢులై చెడిపోవనేల॥ దీని॥ ౧॥ పురుషులేనొకపురుషు మొరసి । మబ్బునొకవానగురిసెను । వానగురిసిన కారణముచే । సోమసూర్యులు సాము జేసిరి॥ దీని॥ ౨॥ ధామణీతలమందునవద్వార । వరపురమందుయిద్దరు । వీరవ ర్యులుగూడి । ఆకసవీధులకునపుడెగసిపోయిరి॥ దీ । ౩॥ అధరారేయిసలేచిఖేచరి । ముద్రియోగము జేయువేళలా । రుద్రరామాఖద్యల ।। రూపనామక్రియలులేవు॥ దీని॥ ౪॥ మూడుకొలచి మూడుదాటి । మూడుమూడారింటనిలచి ఏహకిటికిల్ మండమీ ద । ముక్కుచూడగ తానుతానై॥ దీని॥ ౫॥ యింతరహస్యము లెఱుకజేసిన । హితగురువుమంతీనవేంకట । యతియు మర్మము దెలియకను । మతిలేక చెడిపోయి నారు గొందరు॥ దీని॥ ౬॥ వాసిగక్రియజ్ఞరామదాసుమన । మేకాంతభావము । వింతదెలసిన మహాత్ములకు । వంతోషము మొపరిపూర్ణ యోగము॥ దీని॥

గీ॥ ద్వివళకమలమందు । దివ్వెను పొడగాంచి । ముదముతోడమనసు । కుదుర పరచి । రొదనలేని బ్రహ్మ । పదవినొందుటముక్తి । ధరమయజ్ఞరామ దాసపోష॥

—* మాయామాళవిగౌళ రాగము- అటతాళము *—

౧౦౦॥ తత్వము॥ ఆనందమానందము । సద్గురుసేవ । ఆనందమానందము । ఆనందమానంద । మాయెసద్గురుసేవ । మౌనులై కూర్చున్న । మహనీయులకు బ్రహ్మ॥ ఆనంద॥ ౧॥ మనసు మనసును చెనసి । కమపాపములగలసి । వినయములరగ గురుని । చెనగికనుగొనువారి॥ ఆనంద॥ ౨॥ గురుకృపావొంది । దుర్గుణములన్నియురోసి । గురుభావమెరిగిన పరమభాగవతూల॥ ఆనంద॥ ౩॥ గురుకు దెల్పినయావంచాక్షరీస్మ రించి । ధరలోయాధారమున । మరుగుదెలసినవారి॥ ఆనంద॥ ౪॥ నాదభేదము మాని । సాధుబోధయు నెరిగి । స్వాధిష్ఠభావము । సాధించువారికి॥ ఆనంద॥ ౫॥ ఫ ణిరాజులైయున్న । గుణవంతుకృపచే యామణిపూరకముసైన । ఘనముని ల్పినవారి॥ ఆనంద॥ ౬॥ పనిబోనిమానవులు । ఘనులైయున్నటువంటి । అనాహతమునచేరి ।

ఘనతనొందినవారి॥ శానంద॥ ౯॥ ఆశలన్నియుగురుని । పాశముచె దెగవేసి । వీశుద్ధ మునజేరి । వివశులైనవారి॥ శానంద॥ ౮॥ హంసతానుగూడి । అజ్ఞేయమునజేరి । సంసారిలోమన్న నరములకెల్లను॥ ఆనంద॥ ౯॥ ధరలోమంతినవేంకట। టార్యాల । కృపనొంది । ప్రణవమాశరించె । సర్వజ్ఞులకెల్ల ॥ ఆనంద॥ ౧౦॥ బిడ్డారారమ్మని దొడ్డబోధయుదెల్పి । యడ్లరామదాసు । నేలీనగురుస్వామి॥ ఆనందమానందము॥

గీ॥ సకలశాస్త్రంబులెల్లను । చదువజనువ । తర్మ్నదా దెలియనేరదు యెన్నడైన। గురునిజేరినయట్టి । మరుగుదెలియగవచ్చు । ధరనుయడ్లరామ దాసపోష॥

—* మోహన రాగము- అటతాళము *—

౧౦౧॥ తత్వము॥ యెన్నిశాస్త్రములైతెసమమవున । గురువరులుజూపిన । పున్నశెన్నిలిబయలుగమవదున॥ కొన్నిదీక్షలచేతతనలో । మున్నచివ్యాపమునుజూచి । అపన్నరక్షకమైనిమంత్రము । ఘతనజేయుచునున్నయోగుల॥ శెన్ని॥ ౧॥ అవనిలోశివ రాజయోగులు । అర్ధరేయునియుల్కాని । తనహృదయలింగము । శుద్ధపరచితెరువుగాంచిన పరమపురుషుల॥ శెన్ని॥ ౨॥ యిలమూడుగుణములు । విడచితనలో । ఉడపింగరబాడగని । కడకుడపైనెలకొన్నఎరుకుల । చేడిసోహముగన్నవారల॥ శెన్ని॥ ౩॥ సాంఖ్యతారకామనస్కాయోగము । చెప్పగలగురుదానిజేరి । కరుణదీరగురుకటాక్షము । లమభవించెడిపరమపురుషుల॥ శెన్ని॥ ౪॥ పూర్వజన్మసాఫల్యమున । యీపుడమిలోనరజన్మలైై । శ్రీహరినిప్రార్థించేటిభక్తుల । నాశ్రయించిన । శిష్యగణముల॥ శెన్ని॥ ౫॥ పంచవర్ణాలగుర్రమున । సాధించగలబలవంతులై । కాంక్షచేఆరించిని । ఒకకర్మిచేసినయోగపురుషుల॥ శెన్ని॥ ౬॥ అందముగధరయందుదాసుల। బొందుగోరుచుయడ్లరామ । దాసుదెల్పితతత్వమున । కన్వయముజేసిన । అచలమూర్తుల॥ శెన్నిశాస్త్రము॥

గీ॥ అమ్యలకరుణచే । అష్టమదములద్రుంచి । శ్రేష్టమైనపదవి । జెందగోరి । కష్టపడెడువాడు । గాంచునుబ్రహ్మంబు । ధరనుయడ్లరామ దాసపోష॥

—* నాదనామక్రియ రాగము- అటతాళము *—

౧౦౨॥ తత్వము॥ దీనిభావముదెలియర ; దుర్గుణములకెడబాయర । దీనర్ధమేపరమార్థమని । దిలతన్నలోకెరిగుండర॥ దీని॥ ౧॥ నాదశ్రేవణముమానర । మన

ము ప్రనది పొరుగూరుర । యీపక్షిదెల్పినమాటలన్నియు । తక్షణముయోచించరర॥
దీని॥ ౨॥ ప్రాకటముగనమ్మర । యీలోకమంతయుమాయర । రాకపోకలులేనిచో
టరు । రాజువైయుండరర॥ దీని॥ ౩॥ మాయమాటలుమానర । యిదిమట్టిబొమ్మనిదె
లియర । దేవుడే యీపాదు ఘటముకు । జీవుడాయెనుజూడర॥ దీని॥ ౪॥ అడవిపం
దులు మూడుతనలో । ఆటలాడెనుజూడర । కాసియున్నకాకిపిల్ల । గటుకుమనిదిగ
మ్రింగెర॥ దీని॥ మదపుటేనుగులావుపోడు । పొదలచాటునుజేరర । యీగుట్టుదె
లసినగుడ్లగూబ । గటుకుమనిదిగ్రమింగెర॥ దీని॥ ౬॥ తొమ్మిదికాలవలుచెరువులో ।
దున్నలైదుపరుండెర । చెరువుఒడ్డునమున్నకొంగ । చేపలనిదిగ్రమింగెర॥ దీని॥ ౭॥
కొండకలువలుగొందునూడి । ముండికెత్తెనుజూడర । గండుచీమకటాచ్చిరెంటిని ।
కరచితిన్నగ్రదిప్పర॥ దీని॥ ౮॥ కన్నులకుగనబడదుర । సద్గుణముసాహసురాలుర ।
మేరుశిఖరముచాటునుండి । కేరుచున్నదిజూడర॥ దీని॥ ౯॥ దీనిసాటిగ్రహించుటకు
దుష్టులకుగోచరమువదుర । బుద్ధిమంతులుసిద్ధులకు । దీనధర్మమునగనెంతర॥ దీని॥ ౧౦॥
ధరణిలోశ్రీకాకినాడ పురమునకాపురముర । గుప్తమాటదెలసిన । యడ్లరామదాసు
పాటగ్రహించర॥ దీనిభావము॥

గీ॥ నవద్వారపురములో । నాత్మగనలేక । తిరిగితిరిగిచెడును । పుడమిలోన ।
జడమతులకాపూరి జాడతెలియగరాదు । ధరనయడ్లరామ దాసపోష॥

—* నాదనామక్రియ రాగము- ఆదితాళము *—

౧౦౩॥ తత్వము॥ యీపూరికిదారిదేగదా । గురురాయులుదెల్పిరివకేకదా ।
దారికిఎదురైమూడుకుసకములు । దాటుటమిక్కిలిమొరిగెగదా । మొక్కలైనయే
కాపురికొల్ల । కెదురుకొనిమదమణచెగదా॥ యీపూ॥ ౧॥ పూరుకుదిగుపుదజో
దుతిత్తులు । పూరుచపూరుమ గదబెగదా । పూదగపూదగపూరుగదలి । యదిపుష్ప
స్థలముకెరుతుందిగదా॥ యీపూ॥ తొమ్మిదివీధులపూరుగద । దీనిలోనకొండరెరుగా
రుగదా । పొందుగగురుకృపనొందినవారికి । పూరుధాత్రింతిమరిలేదుగదా॥ యీపూ॥ ౩॥
పూరుకువెలపలఆరుసింహములు । పోదుగలబిజతమాడెగదా । పూరులున్నవస్తామలైదు
గురు । పట్టిపంతకమాలేసెగదా॥ యీపూ॥ ౪॥ పూరుకుమధ్యనుపున్నశంకరుడు ।
గారడిచేయుచునుండెగదా । సారమైనగురుకారణమైతె । గారడితనకవలెంగదా॥
యీపూ॥ ౫॥ గురుకృపకేవికినాడెగదా । మగోణాయములుధన్యంబాయెగదా । యీ

ధరలోయడ్లరామదాసునకు । దైవసహాయమొకటేగదా॥ యూపూరికి॥

గీ॥ గురుసన్నిధిని జేరి । గుణములన్నియు రోసి । పరమునందుమనసు । పదిలపరచి। స్థిరముగా భక్తులు । తరియించుమార్గమిది । ధరనుయడ్లరామ దాసపోష॥

——* హిందుస్తాని కాఫి- అటతాళము *——

౧౦౪॥ తత్వము॥ యిలనుసద్గురు సేవజేసితె । ఫలమేమిటిగురువర । యీ ధరనుసద్గురు । కృపనుపరముకు । దారిదొరుకును । శిష్యుడ॥ ఇల॥ ౧॥ పంచభూతములేస్థలంబున । సంచరించును గురువర । పంచభూతములైదుగూడి । ప్రపంచమాయెను । శిష్యుడ॥ యిల॥ ౨॥ మూడుకాల్వలుదాటమంటి । రదేమిటోసద్గురువర । ఆశలేయః పాశములు । తెగగోసివేయర శిష్యుడ॥ యిల॥ ౩॥ తీరుగజపమాలద్రిప్పను । త్రిక   ను । గురువర । ముందుతనసద్గురుడుదెల్పిన । మూలమంత్రము శిష్యుడ॥ యిల॥ ౪॥ ముక్కుచెవులునోరుకిన్నులు । మూసుటేలను । గురువర । అదేవణ్ముఖిము ద్రియోగుల । సాధనముర । శిష్యుడ॥ ౫॥ నలువిధంబులవాదభేదము । లాభమేమిటి గురువర । వేదశాస్త్రపురాణగాథలు । వెర్రిబోధలు । శిష్యుడ॥ యిల॥ ౬॥ గురుపు శిష్యుల । పరమరహస్యము । దొరుకునెట్లది గురువర । యీధరనుయడ్లరామదాసుని । యడిగితెలియర శిష్యుడ॥ యిలను॥

గీ॥ కష్టులనిందించు । బుద్ధిహీనులకెల్ల । సద్బుద్ధులుదెల్పిన । సుఖములేదు । ముక్తులకెటువలె । మోక్షంబుదొరకును । ధరనుయడ్లరామ దాసపోష॥

——* మోహన రాగము- అటతాళము *——

౧౦౫॥ తత్వము॥ కుదురుపడుటకు సాధ్యము । యిలసాధులకుమది । కుదురుపడుటకుసాధ్యము॥ కుదురుపడుటకు సాధ్యము । గురుపదములను । హృదయమునదలచక । పెద్దలదరగవిధముదెలియని । ముదరమాటలవెధవలకుమది॥ కుదు॥ ౧॥ సిద్ధముగయిదినమ్మము । బుద్ధులకుసెల్ల । సుబుద్ధిగలుగ । నిబద్ధము । బద్ధికాతోపిన్నపెద్దల । హద్దువిలువకరద్దుజేయుచు । కొద్దిపనులకు సిద్ధపడుచును । పొద్దుగడిపె। ఎద్దులకుమది॥ కుదు॥ ౨॥ ఎన్నివిధములదెల్పిన । కొన్నాళ్ళకైనను । పిన్నబుద్ధులుమానున। తన్నుదెలియక కొన్నిక్రియలను । పన్నుగాగల్పించుకొనుచును । కన్నులాగ్రముసంతసమున్న । ప్రసన్నుసెరుగని । దున్నలకుమది॥ కుదు॥ ౩॥ ఎక్కడెక్కడతిరిగిన । ఇటువంటి

టివారికి । ముక్తిమార్గమొందక్కున్నా । చక్కగానదృక్తవరులు । నిక్కముగబోధింపు చుండగ । పెక్కుకాక్కులచేతసాధుల । వెక్కిరించేటక్కలకుమది॥ కుదు॥ ౪॥ మూడుయేదులుగడచునా । రూఢిగతనలో । మన్నప్రాణమునూడునా । గూఢమైనటు వంటిరహస్యము । రూఢిగాతాదెలియకను । పరచేదెలముగని । గూడుమంతెతి । మూఢలుప్పగాద్దెలకుమది॥ కుదు॥ ౫॥ నిందలాడుటమానునా । మాఘులకుబ్రహ్మ। నందమేదోదెలసున్నా । పొందుగామాటిన వేంకటాసందగురు । పాదారవిందము। ముందుగాభజియించరమ। బల్చింతలాదెపంములకుమది॥ కుదు॥ ౬॥ దాసులనుమాదిందినా । దోసములుబలసవెడ । దాసినిమునమునుగాచుట । వాసిగాశ్రీయద్దరామ । దాపుదెల్పినబోధలినకమ। నీచవృత్తినిదిరుగు । కామ క్రోధ లోభ మోహములకు॥ కుదు॥

గీ॥ పేదలరమించప్రీతిలేనివారు । భూతలంబునబుట్టినేమిఫలము । పెట్టిలోనమనుట్టు । జననమైయున్నట్లు । ధరనుయద్దరామదాసపోషు

—* నాదనామక్రియ రాగము- అటతాళము *—

౧౦౬॥ తత్వము॥ హరిహరి యీధరనుగుణవతి । యిదరొజ్ఞోజాదర । తెరవలూపేకురునిజేరి । పరమునొందినదాతది॥ హరి॥ ౧॥ అత్తమామతుఘాజేసి । ప్రస్తుతించినవాడది । ముత్తురాకైఅత్తమామల । మాటవినవిదిగాడిది॥ హరి॥ ౨॥ దురుయగాతనభర్తమాటకు । యెదురుచెప్పనిదాడదీ । పెదరుయింతయుతీకపురుషుని । గదుముచున్నది । గాడిది॥ హరి॥ ౩॥ ధనముగలిగనతనగుణంబులు । నమయుజేసినదాడది । ధనముజూచియుపొంగి । తనదుగుణముమానదు । గాడిది॥ హరి॥ ౪॥ సరతమునవద్దోష్టిగొరకై । వెదకుచుండినదాడది । భర్తగృహమును । లేనిమొదలను । పరుగులిడినదిగాడిది ॥ హరి॥ ౫॥ కామక్రోధము లోభమోహము । కట్టిపెట్టినదాడది । ప్రేమతోవిటకాండ్రగూడను । కామసించెను । గాడిది॥ హరి॥ ౬॥ నిక్కముగపుట్టములయుగ్రై । దృక్కునిలిపినదాడది । పెక్కుమాటలునేర్చితనలో । ముఖ్యమురుగదుగాడిది॥ హరి॥ ౭॥ జన్మపావనజేసికొనుటకు । ధ్యానముంచినదాడదీ । తన్మయంబునుబొందనేరక। తమతుమరువదుగాడిది॥ హరి॥ ౮॥ రాజయోగముచేతజన్మము । రద్దుపరచినదాడది। నిజముదెలియక । కుజమురాకై । ప్రజ్వలించునుగాడిదీ॥ హరి॥ ౯॥ యింతసద్గుణమభ్యసించిన । శాంతగోషుపినాడది । సంతసంబున । యద్దరామదాసుడిదిరూచించెను। హరి॥

గీ॥ అజ్ఞానమను తిమిరమును గొట్టివేయను । సుజ్ఞానమను । దివ్యసూక్ష్మము గను । ప్రజ్ఞావంతుడైనట్టి । ప్రభుత్వముగనవరచు । ధరనుయద్దరామ దాసపోష॥

—* యదుకులకాంభోజి రాగము- ఏకతాళము *—

౧౦౭॥ తత్వము॥ రామనామమంత్ర । రత్నములుదొరికెను । నాపామరత్వ ముబాపెరామయ్య । భజనధారికెను॥ రామ॥ ౧। దుష్టజనులకలవిగాని । ధనముదొ రికెను । అష్టాక్షరిమంత్రార్థసార । మందగల్గెను॥ శ్రీరా॥ ౨॥ గాలివంటివేటకుక్క గొలుసుదొరికెను । మేలుగలత్రికూటవీధి వేటలాడెను॥ రామ॥ ౩॥ యెరుపుతెలుపున లుపులోరాము । పలుకదొరికెను ; అచిలుకను । గూడుటకుసద్గురు । పైగదొరికెను। రామ॥ ౪॥ విరివిగాయి పంచతెరలు మరుగుదొరికెను । విరుగులేరుగులేనిరామయ్య స్మరణదొరికెను॥ రామ॥ ౫॥ ఘట్టిగాపద్మాసనమున । పట్టుదొరికెను । బట్టబయ లైయున్నబ్రహ్మగుట్టుదొరికెను॥ శ్రీరామ॥ ౬॥ కర్మేంద్రియముల । నరికెసూర । క త్తిదొరికెను । జ్ఞానేంద్రియములు । నేడుమూకతోడుగల్గెను॥ శ్రీరామ॥ ౭॥ వృక్ష నిలచియున్నతుదకు । చుక్కదొరికెను । చక్కగతనయాత్మవంటి । చాయదొరికెను॥ శ్రీరామ॥ ౮॥ యిలనుమంతినవేంకటార్యగురువు । దొరికెను । యిలమూడురోగము లకు । నేడౌషధముదొరికెను । శ్రీరామ॥ ౯॥ చదువుకంటెమూలమైన । పదవిదొ రికెను । యీధరనుయద్దరామదాసు । కరువుదీరెను॥ శ్రీరామనామ॥

గీ॥ తమ్ముతానిందించి । తత్వజ్ఞుడైయుండె । అట్టివానిజూచి । యవనిజనులు । కొట్టితిట్టినసేమి । కొదవలేదాతనికి । ధరనుయద్దరామ దాసపోష॥

—* నాదనామక్రియ రాగము- ఆదితాళము *—

౧౦౮॥ తత్వము॥ యెవరేమంటే భయమేమున్నది । యెరిగిన శ్రీహరిదాసుల ను॥ యెరిగినశ్రీహరిదాసులను । విధమెరిగిన భగవద్భక్తులను॥ యెవ॥ ౧॥ వావభేద ములురెండుమాని । గురుబోధభుజించినవారలను । సాధుసజ్జనులబోధదెలుసుకొని । మాధవునెరిగెడిమహాత్ములను॥ యెవ॥ ౨॥ రాకపోకలావారినిజూచి । రహస్యము నెరిగిన వారలను । వదలకతనగురు । వరమంత్రముచే ; మరుగమందేహృదయులను॥ యెవ॥ ౩॥ లింగపురంబున । దొంగలబట్టి । సంగతులెరిగినవారలను । రంగాయనియాగంగ యమునలో । నంగముయుండేసరసులనూ॥ యెవ॥ ౪॥ వాసిగయద్ద । రామ దాసు కృతిచెప్పిపఠించినవారలను ; దాసహృదయ । సర్వేశునితో । పరిహాసములాడేవార

లను॥ యెవరేమంటే॥

కం॥ చయ్యనసద్గురుకృపచే । నాయాత్మను గాంచి ముక్తి । నొందెదుకోరకుఁ । కాయములోపల నుండెడి । మాయకులను గెల్చుటకు । సహాయంబిదియే॥

—— * ఆత్మరామాయణము. శారదపాటమోస్తరు పాడవలెను * ——

౧౦౯॥ దరువు॥ శ్రీసద్గురువులను మదినిగొలుతు । పార్వతీనందనుని । ప్రస్తుతింతు । సరస్వతిని నిరతము మది నుతియింతు । బుధకవులనందరను । ప్రార్థింతు । సకల సజ్జనులనెల్ల గీర్తింతు । యోగముని శ్రేష్ఠులను । బూజింతు । త్రిమూర్తులను । క్రమముగదలంతు । తల్లిదండ్రులకు నమస్కరింతు । ఆత్మరామాయణంబు గవియింతు । యద్లరామదాసుండనై నిలతు॥ గురుచరణా । శ్రితభరణా॥ ౧॥ వృందా॥ సూక్ష్మమనెడి యాకాశమునను౦డు । మోక్షమను అయోధ్యానగరముండు । పరబ్రహ్మమనియెడి । దశరథుండు । సత్యమైనట్టి విశ్వరూపుండు । బట్టబయలు బాలింపుచుండు । తనకు ముగ్వురు సతులమరియుండు । జ్ఞానశక్తి కౌసల్యయైయుండు । ఇచ్ఛాశక్తి సుమిత్రగానుండు । క్రియాశక్తి కైకయైయుండు । యీడి భార్యాత్రియంబమరియుండు । దశరథుని కీర్తి మహినిండియుండు॥ గు॥ శ్రి॥ ౨॥ అట్టి॥ దశరథునికి సంకల్పంబుబుట్టె । యాగము సేయ మదినిదలపెట్టె । క్రతువు పూర్ణాహుతి గనిపెట్టె । తపంబనెడి పరమాన్నంబుబట్టె । భార్యలకు నివ్వ ప్రసాదంబుబెట్టె । వారికోర్కె సఫలంబయ్యెనట్టె । ఆత్మయను రామచంద్రుండు బుట్టె । వైరాగ్యమను లక్ష్మణుడు బుట్టె । లక్ష్యమనెడు భరతుండు తా బుట్టె । చిత్తమనెడు శత్రుఘ్నుండు బుట్టె ॥ గురు॥ శ్రిత॥ ౩॥ జనియె॥ దశరథుడు సుపుత్రులను గనుంగొనియె । కౌసల్య రాముని నెత్తుకొనియె । వారిబుద్ధి రూపములు గనుగొనియె । దశరథుడు భార్యలతో నిట్టులనియె । నేమునందు ఘనభాగ్యమునుకొనియె । శ్రవణమను వశిష్ఠుని గలుసుకొనియె । వీరలకు విద్య దెలుపవలెననియె । యాముని శ్రేష్ఠుడది మంచిదనియె । సకల ధర్మబోధలు నిచ్చుటయ్యె । అన్నియును క్రమముగ దెలుసుకొనియె॥ గురు॥ శ్రిత॥ ౪॥ మెచ్చి॥ రామచంద్రుండు తా సాహసించి । శ్రవణమను వశిష్ఠునిబురస్కరించి । వైరాగ్యమను సౌమిత్రిగాంచి । అవ్యక్తమను బాల్యము వహించి । విషయజ్ఞానమును తా మరచి । అజ్ఞానమను జీవనటు చెనచి । అట్టిజీవు దేశానసంభ్రమించి । విహంప్రియప్రపంచము గాంచి । అందుమిగుల యనురాగంబునుంచి । ఆనందమును బ్రొందయత్నించి॥ గురు॥ శ్రిత॥ ౫॥ కోరి॥ మననమను గాధి నందనుడు కోరి ।

రామచంద్రుడం గొంపోవరోరి । అయోధ్యనగరము జేరెనోరి । దశరథుడుగాంచి మన్నించెనోరి । అమ్మునివరుండిట్లనియెనోరి । రామచంద్రునిమ్మంగోరెనోరి । దశరథుడు రామలక్ష్మణులనోరి । మౌనితో విశ్వమని బల్కెనోరి । రామలక్ష్మణులు తైనమైరోరి । మౌనితోగూడి జనుచుండిరోరి॥ గురు॥ త్రిత॥ ౬॥ అట్టె॥ రామచంద్రుని మదివేట్కబట్టె । మౌనితోగూడిజనుచుండెనట్టె । పాపమనెడి నగములుదాటినట్టె । జ్ఞానమునువిల్లు తాఎక్కుబెట్టె । ఆవరణమనూ తాటకినిగొట్టె । విశ్వామిత్రునకు ప్రీతిబుట్టె । ఇచ్ఛావికారములువచ్చెనట్టె । వానిగొట్టుమని మౌనిజూపెట్టె । నంత రామలక్ష్మణులు గని పెట్టె । సుబాహుమారీచులనుగొట్టె॥ గురు॥ త్రిత॥ ౭॥ జూచి॥ రామచంద్రుడప్పుడు కృపజేసి । దురాచారమగు రాతినటుజూచి । అడ్డమొచ్చెనని కోపంబుజేసి । కాలితో దన్న నదియునెడబాసి । సదాచారమగు యహల్యాగుటజూచి । ఇదియౌనివతియనుచు నున్నంది । ఏకాంతమను మిథిలాపురిజూచి । వేడ్కతోపురమునను బ్రవేశించి । శాంతమను జనకమహారాజుజూచి । సీతామువ్వగను మర్యాదజేసి॥ గురు॥ త్రిత॥ ౮॥ అనియె॥ జనకుడా విశ్వామిత్రునుంగనియె । నాదుపిన్నతంబొకటి వినుమనియె । ఆ సూత్రమును ధనస్సున్నదనియె । దాని విరువసాధ్యంబుగాదనియె । విరచినను ఫలము నొకటున్నదనియె । యామునివరుండాపల్కెనియె । రామలక్ష్మణులగాంచి ఇట్లనియె । ఆ సూత్రమును విల్వెరువమనియె । రామచంద్రుడా విల్లునెక్కనియె । సారించగా తునకలైపోయె॥ గురు॥ త్రిత॥ ౯॥ మ్రోసె॥ దేవదుందుభులు గానంబుజేసె । మిథిలేశుండు గౌరవముజేసె । ఆనందమను జానకినిజూపె । రామచంద్రుడుగని సంతసించె । శ్రీవరమును వశిష్ఠుకు తెలియజేసె । వారితలిదండ్రులకు జాబువ్రాసె । వారువేగిరంబునను విచ్చేసె । ఆనందమను జానకినిజూచె । శుభలగ్నమొకటి నిర్ణయించె । జనకజను రామునకు పెండ్లిజేసె॥ గురు॥ త్రిత॥ ౧౦॥ అందె॥ రామచంద్రుడప్పుడు ప్రీతినొందె । ఆనందమను జానకినిపొందె । జనకమహామహేశ్వరుని శెలవందె । వారుపైనమగుటకు ప్రయత్నమొందె । ఏకాంతమను మిథిలపురమొందె । విడచివెడలగా నామార్గమొందె । మదమను పరశురాముడు కోపమొందె । నిలువుమని రామచంద్రునకుమొందె । నిలచియెదిరించ దిశలు భయమొందె । నన్ను గెలువమని విల్లప్పుడందె॥ గురు॥ త్రిత॥ ౧౧॥ అట్టె॥ రామచంద్రునకు కోపంబుబుట్టె । యుద్ధమునుజేయ మదినిదలపెట్టె । జ్ఞానమను విల్లుతా ఎక్కుబెట్టె । వాసనర్వములచను బుద్ధిబుట్టె । రామభద్రుండు కిల్లుచేబట్టె । వానిలాభములన్నియును రాబట్టె

పరశురాముని చప్పట గాసి పెట్టె । ధనువులకెల్ల నంతోషంబు బుట్టె । దానినంతటి రా
ఘుడు వెడలెనట్టె । మోక్షమును యయోధ్యకు జనియెనట్టె॥ గురు॥ శ్రీర॥ ౧౨॥ అనె
ను॥ రామచంద్రుండు తన్నుతాగనెను । జీవుండనే గాను అనకొనెను । జీవాత్మరహి
తము జేసకొనను । వారితల్లిదండ్రుల గనుంగొనెను । పట్టాభిషేకము జేయుమనె
ను । అంతటను తానుసమ్మతించెనను । క్రియాశక్తియను కైకపనెను । దానిచపలత్వము
న వికల్పమును । మోక్షమను యయోధ్యానగరమునను । బ్రహ్మమును దశరథునివిడచిజ
నెను॥ గురు॥ శ్రీర॥ ౧౩॥ మేలు॥ రాముడు వాల్మె కాయవస్త్రాలు । అన దమ్ముడు సీ
తపల్లాలు । విభునివెంటనడచెను జ్ఞానురాలు । వైరాగ్యమను లక్ష్మణుని మేలు । చేయ
ముసివెడలె రామభూపాలు । చలచిత్తమను సరయునదిదాటుమీలు । నేక బుద్ధియను గు
హుని బ్రతిమాలు । నదియుదాటించినను గాంచె మేలు । తపస్సను చిత్రకూటమున బ్రా
లు । అందునివసించిగనెను చిత్రాలు॥ గురు॥ శ్రీర॥ ౧౪॥ చేరి॥ మనస్సనెడి కాకా
సురుడు రోరి । ఆనందమను జానకిని రోరి । మోసపుచ్చుటకు మదనితాగోరి । బాధిం
పజానకి ఏడ్చెరోరి । రామచెంద్రుండు నదిగాంచెనోరి । దీనిద్రుంచవలెనని దలచెనో
రి । సత్యమను బ్రహ్మాస్త్రింబు రోరి । కాకాసురునిపై విడచెనోరి । మూడులోకముల
కుమ తిరిగెనోరి । తిరిగి రామునకు శరణుయని బల్కెనోరి । దానిసేత్రమును ఖం
డించెనోరి॥ గురు॥ శ్రీర॥ ౧౫॥ చేరి॥ రామచెంద్రుండు వేద్యులోగూడి । వీరాగ్యము
ను నగస్త్యుసంగూడి । ధైర్యమను నత్రిమిమ్ముదుచు వేడి । తనికరుణచే నదియునమహూ
డి । యుండగా రామడతని విడనాడి । శుచియను పంచవటాలలో పత్తిగూడి । యుం
డగా కామమను శూర్పణఖ మాయలాడి । నన్నుగూడుమని రాముతటువేడి । వేడగా
రామలక్ష్మణునిగూడి । దానిముక్కుచెవులును తెగనాడి॥ గురు॥ శ్రీర॥ ౧౬॥ అనె
ను॥ ఆగామియను ఖరుడువచ్చెనను । సంచితమనుయను దూషణుడు గలుసుకొనెను ।
ప్రారబ్ధమన్న త్రిశిరుడట్లనెను । మన్నాగెల్వ నీతరమాగాదనెను । రాముడపుడు యు
ద్ధమునకు రమ్మనెను । రామచెంద్రుండు బాణసనముగొనెను । దీక్షయను కోల్లు ఎక్కుపె
ట్టినను । అష్టదిక్కులును వణకసాగినను । ఘోరయుద్ధమును జేసి రచ్చటను । ఖర
దూషణాదుల గొట్టెనెను॥ గురు॥ శ్రీర॥ ౧౭॥ జూచె॥ రాజసముయను రావణుడు తక
క్షజేసె । ఇచ్ఛయను మారీచునకు ప్రోత్సాహము జెసె । మారీచుండు రాఘవునిజూచె ।
పసిమోసపుచ్చెడి వేషమేసె । ఆనందమను జానకిని దాచె । జనకసుతదీనిగొట్టుమనటిచె॥
రామచెంద్రుండు సీతనెడబాసె । రాజసమును రావణుము తెచె । ఆనందమును జా

నకినిజూచె దానిగొనిపోయెరావణుడుదాచె॥ గురు॥ క్రిత॥ ౧౮॥ ఆయె॥ రాముడా
లేడివిదువెంటబోయె । దానిగొట్టుటకుకష్టతరమాయె । రామచంద్రుండుకోపాగ్నుడా
యె। సూక్ష్మమునుధనస్సుచేగొట్టుటాయె । తిరిగిరామచంద్రుడువచ్చుటాయె । జనక
సుతతనకుకానరాదాయె । రామచంద్రునకుకడుదుఃఖమాయె । లక్ష్మణునిగూడివెదు
కమునసాయె । నిక్షేపమునుకానలకుబోయె। సీతనిచ్చలైననుగానరాయె॥ గురు॥ క్రిత॥
౧౯॥ యెంచి॥ వివేకమువుపక్షినటుగాంచి । విమలత్వమునుసద్గతినిజేర్చి । చింతయనుక
బంధునితామగాంచి । దీనియందువరాదనిసంహరించి । సంతోషమనుశబరినటుగాం
చి । దాంతేఫలముతాసంగ్రహించి । నిదిధ్యాసయనుపవనజునిగాంచి । నతనితోమి
కులస్నేహంబుజేసి । నిర్భయమునుసుగ్రీవుతోచెలిమిజేసి । భయమనువాలినప్పుడుపొడ
గాంచి । వానినొక్కకోలనుసంహరించి॥ గురు॥ క్రిత॥ ౨౦॥ అట్టె॥ రామచంద్రున
కు సంభ్రమంబుబుట్టె । నిర్భయమను సుగ్రీవునపుడు గనిపెట్టె । అతనివిడువకను రా
ముచేబట్టె । సీతవృత్తాంతమంత దలపెట్టె । వాయుజుని వెళ్ళుమని దెల్పినట్టె । వె
ళ్ళివత్తునని పైకంబుగట్టె । రామచంద్రునకు మదివేడ్కబుట్టె । ఆంజనేయుడప్పుడు
ధుమికెనట్టె । మోహమనుసాగరముఅడ్డుబెట్టె । సులువులోవార్థితా దాటెనట్టె॥
గురు॥ క్రిత॥ ౨౧॥ జూచె॥ ఆంజనేయుండుసాహసముజేసె । వార్థిలంఘించితా
కూకవేసె । లోభమనులంకిణీవానిజూచె । వానిపైదానికండ్లెర్రజేసె । రాకురాకు
మనివాయుజునిదాపె । హనుమంతుడప్పుడదాన్నిద్రుంచె । దుఃఖమనులంకలోబ్రవేశిం
చె । దుర్వాసనలనురక్కసులగూల్చె । అంకంతయునువెతకిమోచించె । ఆనంద
మనుజానకినిగాంచె॥ గురు॥ క్రిత॥ ౨౨॥ ఆయె॥ హనుమంతునకునంతోషమాయె ।
జానకినిగాంచి తామఇట్లనియె । రామవార్త సీతకుదెల్పుటాయె । వెళ్ళివత్తుననిశల
వుగైకొనియె । సంకల్పమనుఅశోకవనమునకుజనియె। వనమంతయునుతాచెరికిపోయె।
అజ్ఞానమనుజంబుమాలినిజూచుటాయె । దానినచ్చటనుతెగటార్చుటాయె । సంశయ
ముఅనుఅక్షయుండెదురుకొనియె । వానిక్షణములోవధ్యంచుటాయె॥ గురు॥ క్రిత॥
౨౩॥ ఉండు॥ విపరీతమనుఇంద్రజిత్తుండు । హనుమంతుపైదండెత్తుచుండు । వాని
రాకగాంచెనువాయుజుండు । మిగుల దుడుకుచునువిదలించుచుండు । భ్రమయనుపా
శమునువిడచెననురుండు । దానిచేకట్టుబడిపవనజుండు । తెలివిచేద్రుంచితానుజనుచుం
డు । రాక్షసమయనుదశకంఠునదలించుచుండు । మానమునుఅగ్నిగావించుచుండు ।

జనకజనుగూడుకొని వేగజనెను । మోక్షమను యయోధ్యాపురమునకును । వేద్ర
లో పురములోపలికి జనెను । జీవభ్రాంతి విడపించుకొనుటకును । ఐక్యమనెడి పట్ట
ము గట్టుకొనెను । దశరథుండనెడి పరబ్రహ్మయునకు । విశదముగ తనకు తనువహిం
చెను । విశ్వమంతయును తానుతాననెను॥ గురు॥ శ్రిత॥ ౩౧॥ ఎంచి॥ మంతిన వేం
కటార్యులనుగాంచి । యాగురుపాదములను సేవించి । రామాయణమునే యాలకిం
చి । దీనితాత్పర్య మాత్మనూహించి అంతరార్థమును కథమరచియుంచి । ఇదియొపర
మపదమని నేదలంచి । ఇదియు గురుమంత్రమనుచు భావించి । యద్దువంశమందున ను
ద్భవించి । సకలతత్వార్థములు వ గ్రహించి । రామదాసుడీ మార్గమునగాంచి॥ గురు
చరణాశ్రిత భరణా॥ ౩౨॥



శ్రీమదాంజనేయదండకము నిత్యంబును త్రికాలములయందు పారాయణచేయు
మానవులకు భూత ప్రేతపిశాచ బాలగ్రహ శాకిని ఢాకిని భేతాళాది గ్రహంబులుదొలగి
పోయి సర్వశ్రేయస్సాధకంబును, మోక్షప్రదంబును సర్వత్ర జయప్రదంబునుగలుగును.

## శ్రీ ఆంజనేయ దండకం

౧౦౦ శ్రీమన్మహావంద్య వజ్రాంజనేయ సుమేరూపకాయ మహాబాలబాహ్వాగ

సంజాత వాతూల సర్థూతవైరి ప్రకాండస్ఫుర ద్బాహుదండ భవత్పంచ వక్త్రంబులా న్నిదె ఘోరప్రభాజాల పింగాక్షి యుగ్మంబులున్నిదె కాలాంత కోదండదండా భ వద్బాహుప్రకాండంబు లున్నిదె శేషాహి దీర్ఘోరువాలాంతయున్నివిశాలోరు వక్షస్థలంబు స్ఫురద్వజ్ర సంకాశదేహంబు నిదుర్భరగ్రావనిర్భేద దక్షాశనిర్ఘోష గంభీరధీరాట్టహాసంబు చిత్తంబులందోచె నీనిర్నమాఘోర రక్షస్సమూహంబులున్ శాకినీకూశ్మాండ భూతంబులున్ ప్రేతభేతాళ మారీగణగ్రామ బాలగ్రహంబుల్ బయల్ ద్రొక్కుచీదల్ మహాబ్రహ్మరక్షః కదంబంబులుల్ కామినీ మోహినీ కిన్నరీవారముల్ మార్గముల్గప్పగా జేయునామంట దెయ్యంబులున్ యంత్రము ల్మంత్రముల్ మారుకారుల్ క్షణంబైన నేమాకున్బాధలం బెట్టగా నోపునే యాంజనేయా మహాదేవ వీరోద్ధయా లక్ష్మణప్రాణ సంరక్షణ ప్రోల్లసత్కీర్తి ముక్తాప్రగుత్తుంగ నాకాంత శ్రీకాయమానా జయశ్రీనిధాన మహేంద్రాది బృందారకానీకమున్బట్టి నాకంబుబల్మారు దాగొల్లలబ్బట్టుచున్ దేవతాధామలన్బట్టుచు న్భూరులన్బట్టుచున్ యజ్ఞముల్మాయగా జేయుచున్ సన్మునిశ్రేణులన్బట్టి హింసింపుచున్ లోకవిద్రావణుండైన యారావణున్ రాక్షసాధీశ్వరున్ గొల్వగా భీకర దర్పాంకుల్ బ్రహ్మలోగూడగానేగి నారాయణావాసమైనట్టి వారాశిపాంతన్ మొరల్బెట్టి భక్తాఘురక్షపటిష్ఠుండు శ్రీనాయకుండాది దేవుండు ప్రత్యక్షమై రాక్షసవ్రాత శిక్షాసమర్థ శిక్షావిలాసార్థమై భానువంశంబునం రామరామాంకమై బుట్టెదన్ మీయయాంశంబులన్బుట్టు భల్లూకశాఖామృగానీకముల్ సత్వసంపన్నమూర్తులై బుట్టగాజేయుడం చానతీయంగ సంతోషమున్బొంది వారట్లుగావింపగా కోసలాధీశుడైనట్టియయ్యోధ్యకున్ బుత్రుడై పుట్టి నే మానిజన్మంబు ధన్యంబుగాగాంచితే జానకిన్బెండ్లియై బాహువీర్యంబుచే భార్గవుండైన రామునిన్వాదం కారగాజేసి యుర్వీశ్వరా సత్యసంధాను సంధామశ్శీలున్ గడున్బ్రహ్మణ్యుండైన తాతాజ్ఞ చేదమ్మున్ దుర్జయన్ గోదరామానిజై కానకేతెంచు శ్రీరాముభార్య న్విలోకించి రాకాసి తో బుట్టు జెప్పంగ మారీచ నీచాధి మాయాబలాక్రాంతభర్తున్ జగన్మాన్యసీతంమునే భద్ర సంచించియారావణుండెత్తి కొంపోగినన్ సీతకై కాననంబుల్గిరుల్యాగులన్ బాళులన్ రోయుచున్ దమ్ముడున్ దాశరాముండు రాగా నిజభ్రాతృబాహాబలన్య ప్రకాశ్యయనాడుండు సుగ్రీవుడారాముని౦ గూర్చి స్నేహార్థమై నిన్ను వేగంబపంపన్ పటుబ్రహ్మచర్యాకృతిన్ బోయి యారామ సుగ్రీవులన్ గూర్చి

న్మహాభీమ దంష్ట్రాకరాళ అంజనీగర్భ వాసోధిచంద్ర హూం వం భూతరిశ్వాత్మ జా భూతభేతాళకా నుచ్చాటయోచ్చాట యజయజయ సుగ్రీవమంత్రి అంగదాది ప్రసిద్ధోరుశాఖా మృగాటోపమూలా ఐం యం నమఃనమః స్థూల మేరున్నతాంగ సర్వదేవాత్మకంబైన నీయ ంగమ్ముం జిత్తమందెల్లడక్ గల్పిపూజించువారల్ సమస్తారిబాధానివృత్తిక్ సుఖంబుండుటక్ బంచె శ్రీఆంజనేయా నీముఖంబందు వహ్నిత్రయంబుల్ బలాకన్నులన ద్వాదశాదిత్యులక్ వీనుల దిక్కులక్ చిత్తమందిందుబ్రహ్మల్ భళివక్షదేశంబునక్ రుద్రులక్ బాహులం దష్టదిక్పాలకుల్ గర్భమందెల్ల మేదుసముద్రింబుల్ పూర్వులం బర్వతంబుల్ మహాజానుజ ఘుల్ ధనుంబుల్ వదా దేవతల్ దేవసర్వాంగముల్గా విజృంభించియున్నావు నీకైనమహత్వముక్ జూప గానోవు నాగెవ్వరో వా యుపుత్ర దయాంభోనిధీ నీకు భక్తు డనైయున్న నన్నెల్లడం గాంచి రక్షింపవే భీతినాకింతయైనం జొరంరాకయుండంగ బాలింపవే భద్రమూర్తీ జలంబందు మెట్టక్ వనమ్ములందున్నక్ గిరివ్రాతసంచార మందాత్రీ హాగ్గికయుండంగ నపొగ మానంత రైనన్నదీయాంగ మందంటకుం డంగరక్షింపుమా శ్రీ లం స్వస్తిఘణస్ఘణక్ర్మహాంమయి కిరుకుర్వటంబెల్ల చో నీనామమంత్రంబు చిత్తంబునన్నానియున్నాడ విద్యావిశుద్ధిక్ మనస్సిద్ధినాకిచ్చుచుక్ బ్రోవవే నః స్మృతిస్ఫార వాదోధి దాటింపవే నాంవనైమిందవే దార్ఢ్యమంత్రార్థ వృత్తుల్ గనంజేయవే మాయవేమారు నామానసంబంటి ఓకాకు గావింపకుండంగ దన్నిశ్చయార్థంబు గాన్పింపమించవే శ్రీరామమంత్రానువృత్తిం జగన్మంగళా వానమూర్తీ చిద్యోగ్యమాగర్భ ప్రవర్తీ నమో రామదూత నమస్తే నమస్తే నమస్తేనమః.

గీ॥ కాయమంతయును । యుయ్యాల మంచముజేసి । మాయయనెడి కొద్దగేహము
నను । నయమాత్మయను బాలునకి జోలబాడెద । ధరయడ్లరామ దాసపోష॥

—* కళ్యాణరాగము- జంపె తాళము *—

జోల పాట.

౧౧౧॥ జోజో పరమాత్మ । జోజో తత్వమసి । జోజో పరబ్రహ్మ । జోజో నగదే । పంచభూతి తెయనెడి । మంచంబుపైని శయనించకెళ్లారు । కించేయుంగదే
అంచితముగను ఈప్రపంచంబుమరచి। సీవక్షరంబును నొందిసుస్థిరముగ॥ జోజో॥ ౧॥
తొట్టికి మైమైదు । తత్వములు నుడిపైచి । గట్టిగా అల్లిన దట్టంపు క్రైక । అట్టిపవళించి అహంబ్రహ్మాస్మియనుచును । బట్టపైతెయుండు రట్టుకాయక నన్ను॥ జోజో॥ ౨॥
కరచరణములు నాల్గుకొల్ప నమర్చిన తొట్లో । పరమహంస స్వరూపమును దాల్చి । నిర్వికల్పంబయిన । నిద్రగల్పించుకొని భద్రముగ ప్రజ్ఞానబ్రహ్మముగుచు॥ జోజో॥ ౩॥
మనోబుద్ధిచిత్త అహంకారములు నాల్గు వెనకముందరను గుండీలుగూర్చి ఒనరైనతొట్టిలో । చిన్మయుడనిమ్మనచి । అనుదినము మాచెదను । తన్మయంబునబొంది॥ జోజో॥

౪॥ ఈడపింగళలయను । జోడుతాళ్ళనుబట్టి । రూఢిగబయలనెడు । దూలమునకు ; నేడుముడివైచి నేతపుసకతో సోహమని । పాడెదనుపరబ్రహ్మ । పవళించవే॥ జోజో॥ ౫॥ ఎరుపు తెలుపు నలుపు । బరగియుండిన మువ్పటలు పరుపరచితిని । గుప్తతరముగ నిరుపమానస నిరంజనబ్రహ్మమూర్తివై । నరుడె చివరుపుపై శయనించవే॥ జోజో॥ ౬॥ మోదమలరగను । ముగ్గురుదాదులనుదెంచి । వేదవేద్యుడ నిద్రబోదువనుచు । నాదుబిందూకళలు భేదించిఊచిరి । నదానందమూర్తీవని । మోదమునను॥ జోజో॥ ౭॥ ఇంక మంతినవేంకటాచార్య కృపజూచి । శంకలేకనునిద్ర । జెందుండవే । పొంకమలరగయడ్ల । రామదాసాఖ్యుని । జంకువెడలించి । పీఅంకమున జేర్చుకుని॥ జోజో॥

గీ॥ పట్టెమంచములపైని । వేడ్కతోబిలిచెల్లు । కపటనాటకసూత్ర ఘనునిగూర్చి । మంగళంబులనిచ్చు । మనుజులరక్షించు । ధరనుయడ్లరామ దాసపోష॥

౧౧౨॥ మంగళహారతి॥ హారతిదుగో మంగళ । హారతిదుగో । దేవాదిదేవున । కారతిదుగో । మంగళహారతిదుగో॥ హారతిదు గాధారచక్రము । మీదనాల్గు దళంబులందును । మేలుగా చతురాక్షరంబుల । బాలగణపతి కారువందలు॥ హార॥ ౧॥ ఇష్టముగ స్వాధిష్ఠచక్రము । నందునారు దళంబులం । జెంపొందనేడు షడక్షరం । బందున్న । బ్రహ్మకు నారువేలు॥ హార॥ ౨॥ దండిగామణిపూరకంబున । దశదళంబులు తేజరిల్లగ । విశదముగ పదియక్షరంబుల । విష్ణుమూర్తికి । ఆరువేలు॥ హార॥ ౩॥ ఘనతరముగ అనాహతంబున । దనరుచును పన్నెండుదళములు । నిండుగా ద్వాదశాక్షరంబుల । నుందురుద్రున కారువేలు॥ హార॥ ౪॥ శుద్ధముగ విశుద్ధచక్రము । నందు షోడశ । దళములందున । వద్ధతిగపదియారుఅక్షర । ప్రాణజీవునకొక్కవెయ్యి॥ హార॥ ౫॥ చూడగను యాజ్ఞేయమందున । వేడుకరగ రెండుదళములు । పండువెన్నెల ద్వితీయాక్షరి । పరిపూర్ణఆత్మకు ఒక్కవెయ్యి॥ హార॥ ౬॥ ఈఆరు ఆలయములకు । పైనసహస్ర ఆలయమందు । వెలసిన ఓంకారమగు । మంతీనవేంకటయార్యులకు । ఒకవెయ్యిమంగళ॥ హార॥ ౭॥ వాసిగా శ్రీయడ్లరామా । దాసుహృదయ నివాసులగు । జగదీశునకు యిరువైనాల్గు । వెయ్యారువందల । శ్వాసలైక్యానుభవానందట్టి మంగళ॥ హారతిదుగో॥

గీ॥ రామదాసుడుగుండు । రచియించుధర్మముల్ । భూమిలోజనులు సంపూర్ణముగను । వినిచదివి వ్రాసిన । హింసలుతొలగించు । ధరనుయడ్లరామ దాసపోష॥

గద్య॥ ఇది శ్రీత్రిమూర్త్యాత్మక ప్రసాదలబ్ధ శ్రీమంతిన వేంకటాచార్యవర్యచర
ణారవింద మరందబిందు సందోహపాన పరవశ శ్రీనాగులగోత్రవంశపయః
పారావార స జనిత రాకాసుధాకర అచ్చయాన్వయమహాలక్ష్మీగర్భ
జనిత సకలసజ్జనవిధేయ శ్రీయడ్లరామదాసాన్వయప్రణీతంబైన
సుజ్ఞానచంద్రికయను హరినామకీర్తనలు తత్వములు
పద్యములు సర్వంబును సంపూర్ణము.

## భాగవతోత్తములకొక విజ్ఞాపనము.

(౧) ప్రియస్నేహితులారా! సర్వాంతర్యామియైన పరబ్రహ్మమిదియని గుర్తెరుంగుటకొక దృష్టాంతంబు జెప్పెద, ఒక మొలకను దెచ్చి దానిని నాటిన దాని చుట్టు ఉపయోగములేని కసవు మొలచి దానిని వృద్ధిపొందకుండునట్లు చేయును. తర్వాత నాకసవును తీసివేసిన యెడల నావృక్షము వృద్ధియై పుష్పఫలప్రదాయియై యుండును. అటులనే మానవులకు తాపత్రయాదికంబులావరించియుండి తమ్ము దా దెలిసికొననేరనీయవు కాబట్టి మీవృద్ధికోరెడు గురువు వద్దజేరి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, సత్వరజస్తమో గుణాది దుర్విషయంబులనెడు కసవు ఊడబెరికినట్లైన పరబ్రహ్మము మీయందే ప్రజ్వలించిన సంగతి గోచర మగును.

(౨) పరబ్రహ్మము, సమస్తవ్యాపి, సర్వము తెలిసినవాడు, సర్వశక్తుడు, స్వయంభువు, పరిపూర్ణుడు, నీతిమంతుడు, సత్యసంధుడు, సచ్చిదానందమూర్తి, సృష్టిస్థితిలయ కారణభూతుడు, ఆదిమధ్యాంత రహితుడు, ఇట్టి బ్రహ్మాండవ్యాపకుడు తాను లేనిచోటు లేదని యెంచి తమకిష్టమైన మంత్రమును అర్థయుక్తముగా తెలిసికొని నిత్యం త్రికాలములయందు పారాయణచేయుచు సత్సంగాయుక్తులై సర్వభూత దయాళుత్వము వర్తించు మహనీయులు తామే పరబ్రహ్మమని తెలిసినవారు.

శ్రీగురుదేవతార్పణమస్తు.



కాకినాడ:—శ్రీసుజనరంజని ముద్రాక్షరశాల, 1898

ఈ గ్రంథమును ముద్రింపించుటకు ధనమ్మున చేరి రేపించి మాకు సహాయమునర్చి
పరమ భాగవతోత్తముల నామములు యిందుదాహరించుచున్నారము.

౧ మైలవరపు వెంకయ్య టీచర్
౨ గురుజు సుబ్బరాజు
౩ సూరాబత్తుల వెంకట్రాయలు
౪ మేకలమూని వెంకట్రాయుడు
౫ బత్రే అప్పలస్వామి
౬ దామోధర లక్ష్మయ్య
౭ సేఠా వీరాస్వామి
౮ పుడత్తు వెంకటరత్నం
౯ చోళ్ళపల్లి బ్రహ్మయ్య
౧౦ నక్కా గురయ్య
౧౧ చిత్తజల్లు నరసింహం
౧౨ ఇంజరపు అప్పన్న
౧౩ పాండే సూర్యభాను
౧౪ అరసవిల్లి అబ్బాయి
౧౫ పెంటపాటి అయ్యప్ప
౧౬ మంగాయల వీరన్న
౧౭ వాడకట్టు అన్నపరాజు
౧౮ దేవరాజు నరసింహాగారు
౧౯ సాదూల సన్యాసిరావు
౨౦ బొర్రా లింగయ్య
౨౧ బెండికి వెంకన్న
౨౨ మీసాల సన్యాసి
౨౩ బచ్చు సీతారామయ్య
౨౪ పూరాడ మాతయ్య
౨౫ కొత్తూరి రంగయ్య
౨౬ మల్లిపోలు సుబ్బయ్య
౨౭ చీమకుర్తి తాతయ్య
౨౮ గోపాలపురము భద్రయ్య
౨౯ నాగులకొండ నరసింహం
౩౧ తుంపాల కన్నయ్య
౩౨ నారపరెడ్డి సీతారామస్వామి
౩౩ అంజాల రంగయ్య
౩౪ సుంకర పాపయ్య
౩౫ బోశెట్టి వెంకటస్వామి
౩౬ వాడపల్లి నాయుడయ్య
౩౭ డోళ వెంకన్న
౩౮ పిళ్ళ బాలయ్య
౩౯ కోరాడ రామయ్య
౪౦ పొట్నూరి అప్పన్న
౪౧ శిడగం అప్పలస్వామి
౪౨ కంది రామస్వామి
౪౩ బొక్కా వద్దయ్య
౪౪ మైలపల్లి రామస్వామి
౪౫ మైలపల్లి కిష్టమ్మ
౪౬ రాకోతు పెద అప్పలస్వామి
౪౭ దానల కోటయ్య
౪౮ వనమాడి తాతయ్య
౪౯ బాడ రామస్వామి
౫౦ పినాది పోతన్న
౫౧ మొరుపిల్లి సత్తియ్య
౫౨ గరికిన రాజయ్య
౫౩ మళ్ళా తాతయ్య
౫౪ క్షత్రి సివరామసింగు
౫౫ ఖాదర్ ఖాం
౫౬ విత్తనాల వీరాస్వామి
౫౭ గంగుల చక్రియ్య
౫౮ పోతుల సన్యాసి
౫౯ నబినిపీసు లక్ష్మీనరసమ్మ
౬౦ [illegible]

౬౧ వీరా వెంకమ్మ
౬౨ వేశా వల్లమ్మ
౬౩ వెంటపాటి చిన్నమ్మ
౬౪ నరుకుల శేషమ్మ
౬౫ సన్నిధి వెంకమ్మ
౬౬ గారపాటి నరసమ్మ
౬౭ గుత్తుల సత్తెమ్మ
౬౮ కొండ్రేగుల సీతమ్మ
౬౯ చిత్తనాల రాములక్ష్మమ్మ
౭౦ కురుపూడి లక్ష్మమ్మ
౭౧ చిత్తనాల లక్ష్మమ్మ
౭౨ కురుపూడి వెంకమ్మ
౭౩ కురుపూడి పోలమ్మ
౭౪ సీలం జానకమ్మ
౭౫ రావిపాటి వెంకటస్వామి
౭౬ అల్లవల్లి సీతయ్య
౭౭ కురుపూడి వెంకటస్వామి
౭౮ కురుపూడి నారాయణస్వామి
౭౯ కురుపూడి గంగిశెట్టి
౮౦ కురుపూడి సూరన్న
౮౧ మట్టపర్తి పల్లయ్య
౮౨ సీలం నారాయణస్వామి
౮౩ యర్ర కన్నయ్య
౮౪ సబ్బితి భైరవస్వామి
౮౫ బుడుతు సేరప్ప
౮౬ జక్కుల రెడ్డి
౮౭ రెడ్డం స్వామి
౮౮ కోరాడ నరసింహులు
౮౯ బోర రాజయ్య
౯౦ నాయుడు గురన్న
౯౧ గున్నాబత్తుల భీమలింగం
౯౨ అయినాడ స్వామి
౯౩ పెనుపోతుల జోగిరాజు
౯౪ మండపాటి యరకయ్య
౯౫ పిల్లి సత్తెయ్య
౯౬ పొట్టపల్లి కారయ్య

## ప్ర క ట న.

☞ ఈపుస్తకము కలయువారలు కాకినాడలో శ్రీసుజనరంజనీ ముద్రాక్షరశాలాధికారులకు గాని, కాకినాడ శాఖానగరము రామకృష్ణాపురపుపేటలో వున్న యర్ర రామదాసుగారికి గాని వ్రాసి తెప్పించుకొనవచ్చును.

దీని వెల రు ౦ ౫ ౦ లు పోస్టేజి కొనువారే భరించవలయును.

క్రీస్తాబ్దము 1898 నవంబరు నెల.

